# పీ ఠి క

"పాలపుంత"ను కాశీరామేశ్వరాల తోవ అంటారు. ఇందులో రకరకాల నక్షత్రాలు ఉంటవి. కొన్ని జాజ్వల్యమానమూ, కొన్నింటికి మధ్యమకాంతి. కృతికి ఈపేరు పెట్టడం భావస్ఫోరకముగా ఉన్నది.

ఇందులో అన్ని కావ్యాలకూ సన్నిహితసంబంధం లేకపోయినప్పటికీ విషయవిశేషాన్ని బట్టి వర్గీకరణం కనబడుతున్నది. అధ్యాత్మరేఖ గోచరించేవి కొన్ని, దేశభక్తిప్రధానమైనవి కొన్ని, ప్రకృతిసంబంధమైనవి కొన్ని, ప్రాకృతజనసంబంధులు కొన్ని, ప్రకీర్ణకాలు, చింతాన్వితాలు కొన్ని, చేర్చి కూర్చినట్టు స్పష్టము. సంపుటి మొత్తములో కొంతఅలజడి, ఆవేదన, ఆనందమూ స్ఫురిస్తున్నవి. ఈకవి హృదయవాదులలో చేరుతాడు

గేయాలూ పద్యాలతోపాటు వచనాలుకూడా ఇందులో చేరినవి. ఏదో లయా, గమనమూ ఉండడముచేత ఇందులో చేరినట్టు తోస్తుంది. వచనానికీ పద్యానికీ పాటకూ వైరం లేదు. వచనం కూడా రాగయుక్తంగా పాడడం పరిపాటి మనవారికి.

గీతికాభాషలో హ్రస్వాక్షరాలు దీర్ఘాలు కావడమూ, దీర్ఘాలు పొట్టివి కావడమూ, కొన్నిఅక్షరాలకు ద్విత్వము కల్పించడమూ, సమాసాశ్రయవిధులమీద శ్రద్ధ లేకపోవడమూ దేశీయవాఙ్మయంలో అనుశ్రుతింగా వస్తూనే ఉన్నది. ఈసంపుటిలోకూడా ఆదే పద్ధతి. పద్యదృష్టితో పాటను పరిశీలించకూడదు.

పద్యాలలోకూడా కొంతస్వాతంత్ర్యం కనబడుతున్నది. మత విషయాలలోనే యతిగౌరవము చాలా తగ్గిపోయిన ఈరోజుల్లో పద్యయతివిషయమై పట్టుదల యెందుకో తెలియదు ఈ కవి అఖండయతి పాటించినాడు ప వ లకూ, పు ము లకూ మైత్రి అంగీకరించిన లాక్షణికకర్తాలకు అఖండయతి అంగీకారం కాక తప్పదు. అసలు యతిప్రాసలు అలంకారవిషయాలు కాని, ఛందో విషయాలు కా వని ఉమాకాంత విద్యాశేఖరులమతము

అడివి బాపిరాజ కవికి ఈసముచ్చయము అంకితము చెయ్యడం అందంగా ఉన్నది. బాపిరాజువల్ల ఈ కవికి ప్రరోచనం కలిగి ఉండాలి. బాపరాజు అస్మదాదులకు అన్నదమ్ముల వరుసలోవాడు. సూర్యనారాయణ మూర్తి గారికి బావవరస ఇంకా కొంతమందికి కూడా ఇదే వరసగా కనిపిస్తుంది. అసలు పేరే కాకుండా అన్న అనో, బావ అనో, మామ అనో వరసపేరు పడ్డవాళ్ళు సరసు లనీ, జనరంజకు లనీ తాత్పర్యము.

ఈకృతికర్త అత్తిలి సూర్య నారాయణ మూర్తి గారు భీమవర ప్రాంతాలలో పదుగురిని చేర్చి, రవీంద్ర సారస్వత సమాజము ద్వారా కావ్యామోదము వెదజల్లుతున్న సహృదయుడు. కావలసి నంత కవితాశక్తి మనసులో ఉన్నవాడు. అది అంతా పైకి రావలె నని నాకోరిక !

బెజవాడ
జూలై ౧౯౩౯

తల్లావజ్ఝల శివశంకర శాస్త్రి

# విషయానుక్రమణిక

△

# అంకితము

## బాపి బావకు

▽

పండువెన్నెల పరచీ నట్లూ
మల్లెపూవులు చల్లీ నట్లు
తేనెవాకలు దొర్లి నట్లేనోయ్
ఓ బాపి బావా
ప్రేమవాహిని పొంగీ పొరలేనోయ్!

కుంచెచివరలు చిత్రాలోకాల్
గొంతులోతులు లయలూ పాటలు
గాన మంతా కలా న్నుంటుందోయ్
ఓ బాపి బావా
గానమందే నాట్యా మవుతావోయ్!

నీటుగోటులు తెలియా లేవూ
చాటుమాటలు చెప్పా లేవూ

మాటపొందిక మనసూ మెత్తనిదోయ్
ఓ బాపి బావా,
అమృతమూర్తివి, అందాల్ చిందేనోయ్!

వలుకు తీపులు, భావం మెరుపులు
చిలకరించే చిత్రారీతులు
పిలుపులోనే కరిగిపోతావోయ్
ఓ బాపి బావా,
తలపులోనే ఆడిపోతావోయ్!



# ఫా ల రే ఖ

అరుణ కాంతులు నిలిచె
ఎరు పలమె మబ్బుల్ల
చెరువు కుంకుమ తాల్చె
నెరసంజపై దేలు
నెలవంక, స్వరములల్లే
హృదయ తం
త్రులు మీటి చిరునవ్వులో.

కుముదాలు వికసించె
తిమిరాలు దరిసినవి
నెమిలిపింఛములోని
చెమకులా, ధళుకులా
నెలవంక......

కొలని ఆవలిగట్టు
కలిసెనే దెసలలో

తొలిప్రేమ పులకించు
కలలపరిమళ మాతు
నెలవంక......

నీలారుణిమసంధ్య
లీలానటుని కంఠ
మాలల్లు తారకలు
ఫాలరేఖై వెలుగు
నెలవంక స్వరముల్లే
హృదయతం
త్రులు మీటి చిరునవ్వులో

△

# వెలుగు

అతని హృదయ సుధాపూరి తార్ద్ర మాన్య
మందు పండింతు విశ్వజనాళి ప్రేమ
రాజనాల్ : ఆతడో మహారాజు, కోర్కె
లేమి లే నట్టి ప్రజతోడి భూమి నేను.

అతడు తావులు చల్లు మారుత విహాయ
సమ్ము, ఉడ్డీనగతి పావురమ్ము నేను.
విశ్వజీవన దాత రవీంద్రు డతడు,
కాగి కడ నున్న దిడు నంబురాశి నేను.

అతడు సంగీత నిధి యైన, నతని కోమ
లారుణాంగుళీ పులకితచారు వీణ
తంత్రి నగుదును; రాకా సుధాంశు వతడు,
రతనముల రిక్క సర మాదు నతని కేను.

విరియ బూచిన కల్హారసరసి యతడు,
కొదమ రెక్కల కవ్వి మూగొనెడి తేటి

నగుదు; సాంద్రవినీల ఘనాఘనం బ
తండు, శంపాసహస్ర నిధాన మేను.

అతడు లత యైన, నాకాశమందు కొసల
ననల మొన నిల్చు కమ్మదనమ్ము నేను.
అల్లిబిల్లిగ నల్లుకొన్నట్టి తీవ
యతడు, జీవబంధుర నిలయమ్ము నేను.

అతడు కవి యైన, మంజులాలాప కోకి
లా మహిత చంద్రికావన సీమ నేను,
నను కవోష్ణంపు లేబుగ్గలను వెలుంగు
జిలుగు పని శిల్పి యతడు, కుంచియను నేను.

అతడు, మల్లియయైన జ్యోత్స్నాంబరమ్ము
నొరసి తిరుగాడు పిల్ల తెమ్మెరను నేను;
విలసదానంద కల్లోల వీచికలకు
నిలయ మత, డేను హద్దుపద్దులకు గతిని.

అత డహరహము నూతన గతుల బొల్చు
సృష్టి, యనురూప భావ సంతుష్టి మోద

కలన కలకలు లేని ప్రకాశ సత్య
సూత్రమణిదీపరాజితనేత్ర మేను.

రత్నరోచిస్సహస్రకరాంజలి యయి
ప్రేమకానుక లొసగి స్వాగతము పలుకు
నిధులసంద్రం బతండు, నే నిస్వనిధుల
ప్రాణి మెరుక కొనర్చు దివాకరుండ.

△

# సత్య

మనసులో నే ముందో !
వనధి వీచిక లూగి
కను మొరసి, తను వొరసి
పెనవేసుకొను ప్రేమ
దినము లన్నీ మరచెనో
మా సత్యా
కనుల బిందులు రాల్చెనో !

నే మాయకాడ నట !
నా మాట శూన్య మట !
ఈ మధుర వంశమ్ము
కామార్తు శస్త్రమట - నా
పాటలో
ప్రేమలోతులు లే వటే !

సత్యమే నా మూర్తి
సత్యమే నా పాట
సత్యదేవీ దివ్య
నృత్యవల్లరి బ్రతుకు — నా
ప్రేమయే
నిత్య మిది హృదయేశ్వరీ !

△

# నేతి..... నేతి....

పంచుకొనువారు లేరు హృద్భార మవని !...
తొడిమ విడివడ్డపూవు నీయెడద వ్రాలె
నాదు భావమ్ము లీవె యైనావు దేవ !
పిలుచుకొన నిమ్ము ప్రేమలోతులు కలంచి.

నీల నీలాల వెలుగుల దేలి, యెగుర
బట్టితిని సన్ననూలున గట్టి విడిచి
నాథ నామక్రియా ధిషణా ప్రభూత
విష్ణుపద మార్గ సంచార వివిధగతుల.

తివిచికొందును మరకత ద్వీపతటుల
నొరసి కేరింత ద్రుళ్ళ నా యూర్మి నోర్మి
ముగియ ముత్యాలదోయిళ్ళ ముంచి యెత్తి
నిన్ను నాపాదయుగళ సన్నిధికి దేవ !

పులుకు మనునెడ, నీపాటు పుట్టో చెట్టో
గుట్టయో యేమొ, మెరపుల గూడి పొమ్ము;
పరుగు లిడు మిచ్చ వచ్చిన పగిది, తుదకు
ఉన్నదే కద నీకు దురూహ్యముద్ర !



# దే వ గి రి

నాటి కన్నీటి చుక్కలే నేటి యమృత
వర్ష ధారల సోనలై కర్షక హృది
కిడు ప్రసాద జీవన నిధు లడు గడుగున
తేజు నిగ్గుల తేటులు తెల్పు కతల.

కరడు గట్టిన నెత్తుట గప్పబడ్డ
భూధరారణ్య సస్య సంపూజ్య భావ
మారుతము వేడి పొదలించె నీరు గాగ
గండశిలల విషాదముఖారి శ్రుతుల.

యవనికాభ్యంతరాల స్వప్నావబోధ
చంచలల్ త్రుటిలోన ఖండించు చెరకు;
ఒకటి యొకటిగా నలిగిన మకుట రత్న
హారి రుచి పిండి, తేమ లేదాయె వనుల.

చూడ తలపాగ పడు కోట చూరులందు
క్రాగి చర్మాల నోలుచు సంగరపు చమురు

దిడ్డికంతల పొగచూరు దేవళాల
గబ్బిల వధూటి పురిటి వికార మొలయు.

కేశవ స్వామి ఏక లింగేశ్వరాల
యముల వెలుగదె యొకవత్తి యైన సంధ్య,
నాదు హృద్దీపికయె చలనమ్ము జీవ
తతికి విశ్రాంతిభంగమో పతితమణియొ.

రాజు నీనాడు మా మహారాణివాస
చితుల దాగొన్నయగ్ని; ఈ చెట్లు విసరు
ఇంకిపోలే దనారత మిట నిడు మధు
జలము లాగి ద్రావ మాదు రాజన్యహృదిని.

దించుకొని పోయినవి కాల తిమిర రజపు
గర్భగోళాన అరిమెన కారుచిచ్చు
వీర భారత సైనిక వితతి వెడలు
రత్నసోపాన గూఢ పూర్ణాక్షివితతి.

▽

!

ఈ
విశ్వమున కెవరు
వీవ నిచ్చారో ?
చల్లగా వీచి మము
తల్లివలె జోపు.

ఈ
నల్లకొండ కెవ
రల్లారె పాల
వెల్లి ? పారలలో చుక్క—
పిల్లనై యూగ.

ఈ
భారతమున కెవ రి
చ్చారె ? రూపు
పొందు పొరుగుల కలపు
హిందుస్తానీ తోడి !

ౘ

## నల్ల జెండా

ఆబూ పర్వతం పచ్చ మోసు లెత్తింది. ఉద్యాన కుటీరద్వారం తెరిచి శతవృద్ధు ఠాకూరు పడిపాదం బయట పెడతాడు కోకిల కూస్తుంది ఆయనశిరస్సు ప్రసూన మకరంద ఆర్ద్ర మవుతుంది. ప్రకృతి నవీనతను అవలోకించి, మొగము చిట్లించుకొంటాడు.

యుగాలే ఊగి పోయాయ్ !
ఎగతాళా పూలు పరచేవ్ !
మనకవారిం దర్ధ గోళం
పసలారిన చారలె యీ
పలితకేశి బక్కనరాల్.

వెలిగా యో నాడు హస్త
తలిని కత్తి పూలచెండ్లు
మెలి పెట్టిన మీసాగ్రాల్
నిలిపె జంట నిమ్మ పళ్లు.

ఉరుమకు నీపాడుగొంతు
మొరకు వోయె నేమినేడు
చరవకు వెన్నదిమి గంధ
సారపూత చేతి గాలి.

నకనక లాడే మా కీ
నవ్యరాగ శ్రీ లేటికి
యుగా లైం దే నాడో
ఊఁ ఏ మను కొన్నావో !

జీర్ణ పర్ణ కుటీరాభ్యం
తరములలో నక్కెను పో
మంచిది జితో స్మి యనుచు
మరలు, లేదు వేడిచ్చుట !
యుగాలే .....

△

# వి స్మృ తి

అది కాటుక కొండల దిబ్బ
శూన్య లోకం
నదులూ కాల్వలూ రక్తపు సుడిగుండాలు
వట్టి పాడిల్లు
అవతల అడుగు పెట్టా లంటే
చురుక్కు మంటాయి
గచ్చ పొదలు.

అడు గడుక్కీ పదడుగులు దిగిపోవడం
వడచే శోషిల్లడం
ఒక్కణ్ణే ధ్వజ మెత్తితే
ఉక్కిరి బిక్కిరిగా
పొగలు కమ్ముతాయి.

నురగలు కక్కే 'లావా'
ఊళ్ళూ యిళ్ళూ చూడదు
వెర్రి కేక లేస్తున్నా ననుకొన్నా.

కర్రు మంటూ ఇంజన్లు
దొర్లి పోతాయి.

మహా గ్రీష్మానికి మగ్గినా
మాలతి
మందపవనానికి తల
ఊపుతూనే ఉంది.

ప్రళయ ఝంఝూ మారుతంలో
భస్మరేణు వయినా నంతట్లో
ఎంత మహావేదనో కాసం తైనా
తెలియని ఏమి టేమిటో!

తెలి వొచ్చిం దంటే అమ్మో!
నిలువునా నీరై పోతా!



# అమ్మ

సంగరమ్మున
జట్టు కూలగ
మరలు సుతునకు
విరుగు పాలిడి
విరిగె పసులని
చురుకులాడే
తల్లి కావాలీ
    లోకము
తల్లడిల్లాలీ! ...

లోక వీరుని
ఏకపత్నీ
వ్రతుని పొత్తుల
పాలు కుడుపుతు
జోల పాడుతు
దేశభక్తుల
దివ్య చరితము

తెల్పు జీజీ
అమ్మ కావాలీ
దేశము
అడుగు వెయ్యాలీ...

స్వేచ్ఛ కొరకై
ప్రేమ కోయుచు
మల్లె సెజ్జల
వాళ్ళు కందే
పసిడి కుర్రని
బంది కనిపే
మాత కావాలీ
గొలుసులు
మాయ మవ్వాలీ !

Δ

# కవీ!

ఖడ్గ తిక్కన మూర్తి
కాలాహి బాలుండు
విజయ రుద్రమదేవి
వీర రంగారావు
ఓ కవీ,
పాడవోయ్
ఉజ్జ్వలిత గీతాలు
ఆంధ్రశూరులహాస,
మరుణ నేత్రాంచలాల్.

చింపి పాతలరోత
చిక్కిపోయిన మేను
కాంతులే కనబడని
కన్నుల్ల కరుణాల్లు
ఓ కవీ,
పాడవోయ్

ఉడుకు రక్తపు పోటు
దేశాన పరుగెత్తు
దీన జన దుఃఖార్తి.

గుడి దేవుడే లేడు
కులభేద ములలోన
చెప్ప రాదట పేరు
చేర రాదట వారి
ఓకవీ,
పాడవోయ్
ఉస్సు రను పాటల్లు
పాడు సంఘపు కోట
బద్ద లౌ బురుజుల్లు.

ఎందుకోయ్ నీరసం
ఎందుకోయ్ ప్రణయాలు
భావకవి కంటికీ
పడతి రూపాలేన

ఓ క వీ ,
పాడవోయ్

ఉజ్జ్వల ద్గీతాలు
ఉడుకు రక్తపు పోటు
ఊగవోయ్ శిల్యాన
ఉప్పొంగవోయ్ కవీ !

# అ మ ర జ్యో తి

కారు మబ్బులచికుర జాలం
మెరుపు తీగల మేని వెలుగున
నెమ్మి నృత్యం నేర్చుకోవోయీ,
ఓ పెళ్ళి కొడుకా,
కమ్మనైనా గళము సారించీ.

పసిమి పుష్పాడి చిందు వే ళిది
కసటు దీరిన పసరు కలయిక
రసములో రాజ్యాలు నింపమ్మా,
ఓ పెళ్ళి కూతుర,
రణవిజేతల వనమూ సృష్టించి.

వెండి కొండను వీడి వచ్చి
రెండుపక్కల నిండి తుష్టిగ
పొంగి విశ్వజనాళి దనుపండీ
ఓ ప్రేమజీవులు,
గంగ యమునల ఖ్యాతి నిలుపండీ !



# ఉదయం గొబ్బి

సంక్రాంతిపండగా సాగి వచ్చే నమ్మ !
మా ముద్దుమరదల్లు ముగ్గు లెట్టేను
ముగ్గులోపల గొబ్బిముద్ద లెట్టే నమ్మ
ముద్దపై బంతిపూ మొగ్గ లెట్టేను
సంక్రాంతి.........

పసుపు కుంకుమ పెట్టి పూజ చేసే నమ్మ
తామరాపూవంటి తమ్ముణ్ణి ఇమ్మనెను
చేమంతి పూబోలు చెల్లెల్ని మ్మనె నమ్మ
మొగిలిపూవూలాంటి వగకాణ్ణి కోరింది
సంక్రాంతి.........

గొబ్బిళ్ళు అదిమేసి గోడ చరచే నమ్మ
చిన్నిచేతుల దండ చేర్చి కట్టేను
దండ లన్నీ బుట్ట నింపివేసేనమ్మ
మాఘపొంగలి కివ్వి మామ్మా నీ కనెను
సంక్రాంతి.........



# హే మం తం

కాళ్ళు కాలగ పరుగు లెత్తే
వాళ్ళు లేరే, చెట్లనీడల
తూలి, దేహము తుడుచుకొంటూ
మళ్ళువా రే మైరో గానీ,
వృద్ధు డై నాడా - సూర్యుడు
సద్దుకొన్నాడా!

రెండు గంటలు కాకమును పే
మండు కొరవిగ ఉండు తపనుడు
పండి యెండి ప్రచండ మై తన
చండశాసన బిరుదు కోల్పడి
వృద్ధు ......

తమ్ములకు కుశలమ్ముగా[illegible]తా
నెమ్మదిగ నడచేటి నడకలు
వమ్ము చేసి వినమ్రుడై వై
రమ్ము చూపే నిశికి జంకుతు
వృద్ధు ......

మంచు వలిపెము తలకు జుట్టుకు
కుంచి దేహాము, అడ్డదారుల
నుంచి దాక్షిణ్యమున వారుణి
పంచ జేరగ కుంప పెత్తే
వృద్ధు డైనాడా—సూర్యుడు
సద్దుకొన్నాడా!



# నె ల యే రు

గాలికెరటాల కడ ముట్టి గంతు లేసి
ఉరక లెత్తుచు నొరలుచు చర చర వడి
లోయలను నిండి తొణకక లోతు గుండె
దెలుపు నీహృది కాంతిలోపలను నీడ.

△

# తృణమూ : మొయిలూ

కులుకు వగతోడ నీలాల తళుకుతోడ
మెలగు నీచూపులోని యా పిలుపు చల్ల
నై మదీయాంతరంగ విహాయసమున
నిలుచు సుధ జాలువారి నా యలపు మలపి.

నాదు నెద నీదునలుక తీక్ష్ణాతపమున
నెండి బీటలు వారె నే నేడ్వ నొక్క
చుక్క రాలదు కన్నోయి లొక్కపరిని
హాస శంపాయుత మొనర్పు, మార్ద్ర మగును.

ఏది రుచి నాల్కకును కంటి, కేది సాధు
వో, తరుగు లేని పంటనే యొసగి నీకు
వాడి వత్తైన నాదు హృద్వనజ మొక్క
సారి సరసపుపులకల తీరు మప్పు!

పచ్చనై చిత్ర భావంపు వల్లి నాకు
మొగ్గలన్ దాల్చి వేచితి సిగ్గు సిగ్గు!
పలుకు తీపుల దోహద ఫలము నోమ
నైతి! ఎండెద, కాల్చి, బూ దద్దుకొనుము!

నమ్మితిని రాగరసజీవిత మ్మటంచు
నిలువు దోపిడి యయ్యె; నే కలల గన్న
క్షణ మ దేలాటిదో! క్షణ క్షణము నాశ
ముందు కీడ్పడి : అంతమే పొందు మనకు.

ఉబికి యుబలాట పడుకోర్కె లబల వయ్యె
అడచితివి. నీతిరస్కార మెడపి పగయు
చెలిమి యెందేని సరిసమానులకె గాక
సబలులం గోరికొన్న పసందె, చెపుమ!

పాముకుబుసమ్ము వోలు నీపైట నురుగు
వెల్లి విరిసిన వెన్నెల నెల్ల బట్టి
శూన్యహాస్త్రాల దరి జేర్చి స్రుక్కిపోతి.
కృష్ణ పక్షమ్మె మేలు ...

నేను నిర్జీవ ప్రతిమ నైనాను ! ఈ య
భాగ్యజీవిని నీతోడి వారు నవ్వి
కో వినియు మది జేర్పవో కొంగు చాటు
కూర్చి తొలగియొ, కం డ్లద్ది కొనెడి తీరొ !

నేను జీవింప బని లేదు నీవు లేక.
కాని నీరూపు, నీకతల్, కంఠమందు
ప్రాణ ముండెడి దనుక రాపాడి పాడి
చెట్టు గుట్టలు తల లూప జెప్పి పోదు.

# వెంపు ప్రేమ

చెట్టుల్లారా
పుట్టల్లారా
చెట్లా పైనా
పిట్టల్లారా
గుట్టల దాటెనో
మెట్టల నెక్కెనో
చెప్పరటే మీరు
కృష్ణుని
తప్పటడుగులా దారి!

చిన్నీ బొజ్జా
చిగురూ చేతులు
గజ్జెల కాళ్ళూ
కజ్జల కళ్ళూ
నీలపు వొళ్ళూ
నెమలీ పించం

పగడపు పెదవీ
పలుకుల తేనె
మురళీ గీతం
మరపించిందా
చెప్పరటే మీరూ
కృష్ణుని
తప్పటడుగులా దారీ!

అవిగో ఆవులు
కదలక ఉన్నవి
రారా నాన్నా
రారా తండ్రీ
రారా, వెన్నలు
ఆరగింతువూ
ఇంత కోపమా
యెల్లా గయ్యా!
దిష్టితీతునా

నొప్పి బొట్టుతో

పొదరిళ్ళల్లో
దాగక రారా !

చెట్టుల్లారా
పుట్టల్లారా
చెప్పరటే మీరు
    కృష్ణుని
తప్పటడుగులా దారి !

△

## ప్ర వా సి

హృదయమున పొంగి కలచు నా సొదను కనగ
ధీరహృది నాని చెప్పి పంపితిని నీకు.
వనధి చెలి చనినాడు నీవంక, అపుడె
ఘోరు మన్నాడు, ని న్గని హోరు మనడె!

నీవు దోసిళ్ళ విరజిమ్మినావు, నావ
కదలు తరి, నీవియోగదుఃఖాశ్రురాజి
ప్రేమసూత్రాల వల పన్ని వేచినాను
పట్టె నిర్జీవ మౌక్తికాల్ పట్టువడియె.

చక్క దిద్దిన తలకట్టు నొక్కుల పయి
వెలిగులాబీలు మల్లె జాజుల సరములు
ప్రిదిలె మలయానిలాహతి చెదరి, భంగ
ఫేనములు గాగ నన్ జేరి ప్రేమ చుట్టు.

నీదు ననురాగరసఝరి నేత్రసరసు
లంచులగ్ని మోవ నుబికి తా నించు మించు
సగముపై భూమి మించె; ఆ సగము నేను
నీవు నిలిచిన తావులే నిలిచియుంట.

మాట ! ఉండుండు; విధి విరామమ్ము లేక
ఎగయు జిమ్మకు, జలకేళు లింక జాలు.
నీవు నావంక నేర్పుమై నెట్టుజలము
తరగనిచయమ్ము నా వచ్చి తరుము నన్ను.

కావలసి నట్టివాడె గా గాలిడింభ
కుండు, దివ్వున పరుగెత్తుచుండు, నేది
చెప్పి పంపిన నీవు నా చెవిని వేయు
మగిడి చెప్పంగ దరలు నా మాట నీకు.

తిరుగ చనుదెంచుదాక నా తీరమందె
నిలుతు వన్నావు. చెప్పుకో సులువు రేల
బయటివారలు వినకుండ ప్రణయకథల;
నీకు పెరవాడు కాడు రత్నాకరుండు.

పగలు నీ చూపుటెండ తీవ్ర ప్రకాశ
మగుట, కన్మూసి వేగి నిర్మల సుధాంశు
శీతలేక్షణ పాత విధూత తాప
మౌని నై రెప్ప లల్లార్చ మాని చూతు.



# కొలిసే నోయ్!

సీర యిరసీ కట్టి
సెంగు మొల్లో దోపి
సేలగట్లూ దాటి వచ్చేనోయ్
బావ,
చెంగు చెంగున ఉరక లేసేనోయ్!

నెత్తి కెత్తిన మోపు
ఉత్తబెం డైపోయె
పదము గొంతూ కలుపుకొందామా
బావ,
పది అంగలలో మేటి యేతామా.

సేతి కందిన పూలు
సెవిలోన జూకాలు
ఊగిన లాడిస్తు ఊకొట్టుతూ బావ
నిలు వెల్ల ఝల్లు మన నిలిసేనోయ్
బావ,
కలువ కన్నుల నిన్ను కొలిసేనోయ్!

# గో గీ తి

క్రేళ్ళురుకు క్రేపులతో
తుళ్ళాడు బాలకులు
దక్షిణానిలశ్రుతికి
తందనాల్ పాడారు.

శాంతి శాంతని వెలుగు
జల జలా చేలపై
వాలి కంకుల జొచ్చి
పంటసిరి రూ పొందె.

మందగమనాలతో
మళ్ళేటి గోవులను
మహిషమ్ముపై నెక్కి
మళ్ళించు గోపకుడు.

దున్న తత్తడి రౌతు
మూడల్ల మరలిస్తు

గొంతెత్తి గోగీతి
కోకిలై పాడాడు.

చేలపై దారిపై
చెట్లపై నింగిపై
ఆ ప్రశాంతపువేళ
అలమింది ఆపాట.

ఏగురువు నేర్పెనో
యీపాటలో తీపి !
దున్నస్వారిని గాక
తోచునా గొంతులో !



# పోలి స్వర్గం

కోడలు పోలిని పో వద్దని, అత్త కార్తీక మాసంలో ప్రతిరోజూ తెల్లవారకట్ల నదిక వెళ్ళి, స్నానం చేసి అరిటి దొన్నెలో దీపాలు పెట్టి, నీటిమీద వదిలేది. చాకెత పోలి అత్తకు తెలియకుండా ఇంట్లోనే చన్నీళ్ళస్నానం చేసి, దీపారాధన చేసి,అత్తకు కనబడకుండా దీపం మీద పెద్దకుండ బోర్లించేది. జీవితాంతానికి పోలి సుకృతం వల్ల స్వర్గానికి వెళ్ళుతుంటే, అత్త దానికాళ్ళు పట్టుకొని వేలాడింది. దేవతలు దాన్ని తన్ని లాగివేశారు. .. ఇప్పటికీ కార్తీక అమావాస్య తెల్లవారుఝామున, అన్నివర్ణాలవారూ పోలిస్వర్గం రోజు అంటూ స్నానాలు చేసి, దీపాలు దొన్నెలలో నీటిమీద వదలి, దానధర్మాలుచేస్తారు. దొన్నెలలో దీపాలు కనుచూపుమేరదాకా ఆరిపోకుండా వెలుగుతూ ఉంటే, ఎక్కువపుణ్యం లభించినట్టు భావిస్తారు.

బాపనో రంతాను
పళ్ళట్టు కెదుతుంద్రు
చిమ్మచీకటి గుంది
చె య్యట్టు కుంటూను
లెగవే వోలమ్మా,
సారగానికి
పదవే వో లమ్మా!

గజగజ లాడించే
గాలిలో దీపాలు
వణుకుతు ముట్టిస్తు
వంద లున్నా రాడ
నే యెళ్ళనా, వస్తవా?
యిక్కడే
జాగు చేస్తూవుంటవా?

యి దేంటి వోలమ్మ!
అందరూ మునిగారు!

పట్టు బట్టలు కట్టి
బార్లు తీర్చా రేంటి!
ఆకాశ మంటిపోరా!
మడి లేని
నాకు సొరగం ఇవ్వరా!

పదుగుర్లోకీ వచ్చి
పార్దించి పార్దించి
నీళ్ళలో దీపాలు
వెళ్ళితే సొరగాలు!

* *

మనపోలి సొరగ మెల్లే!
గొప్పోర్ల
మనసులో వెలుగునోలే!



# కలత

ఎదలోన కుదురు లే
దదరి బెదరీ మనసు
పదిలమ్ముగా కున్నదీ - రొదలతో
కదిలిస్తి లోకాలనూ.

కలగుండు వడి పోయె
కలతని ద్రయినట్లు
తలపులే పరుగెత్తునూ - పిలిచితే
నలుదెసలు మారాడవూ.

కలరుతమ్ములు చెలగ
పలపల ధ్వనులతో
ఇలు నేరు పత్తు లన్నీ - కులుకుతూ
తిలకించి హసియించునూ.

ఇరులు కమ్ముకు వచ్చె
తరువు చాలుల, బయల
తిరిగి తిరిగీ బడలితీ - కరిగి నే
దరి లేని నిశి నైతినీ!

# నిట్టూర్పు

చలియించి వీచె ఝంఝామారుతాలు
సుడులౌచు; తడబడుచు నడుగు లిడినాను.

పండుటాకై ఒడలు పరుగులెత్తింది
సరస బిలిచిన లోతు సన్నన్ని వెలుగు
దిశలు చల్లనిపిల్పు తెచ్చె నెటనుండో!

గాలి చప్పుడు వినని కంచెల్లో బడి నీ
వాన మీ యాయాస ఫలితముగ నెంచి
దబ్బునా కూలినా; దుబ్బునై పోతె!

చురుకు సూర్యుడు లోతు చొరగలేడేమొ!
చిన్ని ఆకుల నోడిని చేర్చుకోం దేమొ!

చల్లన్ని సడిలేని పిల్లతెమ్మెరలో
కలిసి కడ కొత్తు వని తల యూపుదేమొ!

బరువైన రాతి యెద బద్దలై ముక్కలై
గవ్వలై కడలంటి కళ్ళు శూన్యాలై
నిట్టూర్పు పొగలచే నేని యింతైన
కార్చలేనైతి తుది కన్నీటి చుక్క!

# నడమంత్రం

కలుగక కలుగక
కలిసే వస్తే
కాయం గీయం
నాయం నాణెం
కనపడుతుందా
వినపడుతుందా

అడుగులు తడబడ
నడిచే బడబడ
నెత్తికి కళ్ళూ
మత్తగు వాళ్ళూ

హాసం దోసం
పాపం పుణ్యం
రాగం రోగం
వేగం భావం.

పలుకులు తేనెల్
హృదయాల్ వజ్రాల్
బధిరాల్ శ్రోణాల్
కంటక కాయాల్.

కన పడుతుందా
విన బడుతుందా.

# అ ను మా నం

అది పెనుభూతం! దానికళ్ళు
పచ్చన, దానిమొహం ఎర్రన
దాని హృదయం నల్లన
దానికి ఆత్మలేదు!

ఆ భూతం రాత్రిళ్ళప్పుడు
ఒంటిగా ఉన్నప్పుడు
ప్రత్యక్షమై నిన్ను
ఆవరిస్తుంటుంది !

అది నిన్ను దొంగను చేస్తుంది
దోషాలు చూస్తావు
లోకం కాళరాత్రి
దానిలో తారాడే దొంగవు!

అగ్ని రగిలినట్లు
జ్వాలలై ప్రేమని విశ్వాసాన్ని
ఆనందాన్ని దహించి
మాడుస్తుంది!

# రాంబంధం

ఎక్కడ వుందో
ఏమో యేమో
తెలియందే
ప్రత్యక్షం !
సరి సరి నీ
శత్రుత్వం !

బాగా వుండి
బతికిన రోజుల
కడుపులో కాళ్ళే - ఖర్మం
చచ్చి చివికితే - భర్మం

ప్రేమ పేరుతో
పీక్కుతినే రాం
బంధూ, నీదే చోద్యం
కుళ్ళినదే యా ఖాద్యం.

పంక్తులు సాగీ
పత్రా లారసీ
చేసేదే ఘటాశ్రాద్ధం
అదే నీ బ్రహ్మానందం

గద్దను కానీ
కాకిని కానీ
చేరనీని నిబంధం
కట్టుబాట్ల కనుబంధం.

# నారాయణ దాసు

విన్నామురా పాట
కన్నామురా నృత్య
విన్యాస వీచికల
విహరించు మధురిమలు.

పలుకు తేనెలు జిల్కు-
పద్మజుని రాణివిర !
కవిత వేదవ్యాసు
గంభీర వాక్కురా !
విన్నామురా..

ఆ నడక లా నృత్య
మా నాట్య గతులలో
కరగించు లాస్యాల
భరతముని ఆడెరా !
విన్నాము.....

శంభో పదమ్ములో
అంభోధి అరచెరా !
కాళ్ళ గజ్జెల మోత
కంపించె కులగిరులు
విన్నాము రా......

సంగీత విద్యలో
చక్రవర్తివి నీవు
మహతీ విపంచికా
మహనీయ రూపమవు
విన్నాము రా......

సప్తతి శరత్తులే
లిప్తలై నడిచెరా
వాగ్గేయ కారకా
ప్రజ్ఞా ధురంధరా !
విన్నాము రా......

# వసంత స్వరం

పాడినావే పాట పంచమస్వరములో
ఈ డెవ్వారే నీకు మధురగీతాలలో
పరుగెత్తె నాకళ్ళు పత్రాలనీడలో
విరిబోణిచూపులా, మెరుపులా పోయావు
పాడినావే......

పాడినానే పాట పంతువరాళిలో
ఓడానె పందెమ్ము వ్యోమనీలప్రభా !
పాడినావే......

మధుమాస కంఠమా ! విధుపూర్ణ కిరణమా !
మత్తిల్లు యువజనుల నృత్తలయ తోషమా !
పాడినావే......

# ము ర ళి

నా పాటలో తీపి
నన్ను కలిసే వార
        లానసీ
        గం తేసి
పాడనీ గొంతెత్తి

రాగ దీప్తులు మీర
రంజిల్లనీ మెరసి
        తుళ్ళనీ
        దోబూచు
లాడనీ వలపులో

శూన్యలోకాలలో
చుక్కల్లు పొడవనీ
        మెలగనీ
        కనుపాప
మెరుపు మెత్తని చాయ.

# కోయిలా!

ఇది వసంత శుభోదయ, మిట్టితెరిని
పడుచు హృదయవనాల పుష్పాపచయము
ఝూనితివి కాని దేశాన్న బుర్ర తిరుగు
దిమ్ముగొను గీతరవళి వైరమ్ములేల !

## సమాప్తము